శ్రీరామాయ నమః

# హరి శతకంబను భాగవత సారము.



శా॥ శ్రీమత్ క్షీరధిజా హృదంబుజ వసత్ శ్రేష్ఠ ద్విరేఫంబ, వా
గ్భామేశాది మునీంద్ర మానససరః ప్రాంచన్మరాళంబ, దు
ర్వ్యామోహాగ్రహ మత్సరోరగ విభిద్వాజీశ, ఘోరాఘరో
గా మూలాంతక దివ్యభేషజ, నమోస్త్వాధారమూర్తీ, హరీ॥ 1

శా॥ శ్రీవిష్ణూ, మధుసూదనా, నరసఖా, సీతాపతీ, భూపతీ,
గోవిందా, మురవైరి, శౌరి, వరదా, గోపాల, నారాయణా,
భావావిర్భవ భారతీశ జనకా, భద్రేశ, దామోదరా,
శ్రీవత్సాంకిత చారువక్ష, కరుణాసింధూ, ముకుందా, హరీ॥ 2

హంసయానము॥ శ్రీధరా, సహస్రనామ, శేషశాయి, వాసుదే
వా, ధృతాబ్జ, విశ్వమూల, వాసవానుజా, పతం
గాధి నాథవాహనా, శుభాకృతీ, చతుర్భుజా,
సాధుపోషకా, ముగ్ధ, శార్ఙ్గపాణి, శ్రీహరీ॥ 3

ఉ॥ నీరద నీల దేహు, నవనీరజనేత్రుని, నిష్కళంకునిన్,
నీరధిజా హృదబ్జ హరి, నీరజనాభుని, నిర్జరప్రభున్,
నీరధివాసు, నచ్యుతుని, నీరజ భూభవ సేవితాంఘ్రి పం
కేరుహు, నిన్నలంతు మదిఁ గేశవ, పాశధరార్చితా, హరీ॥ 4

ఉ॥ సత్వగుణ ప్రధాన, ఖగసత్తమయాన, సుధీనిధాన, వి
ప్రత్వనిదాన, భోగికులపాలశయాన, గతోపమాన, సౌ
మ్యత్వవిరాజమాన, నిఖిలాగమసార సుబోధనాఢ్యన
క్తృత్వవిధాన, యానన జితేందు విలాస, సుహాస శ్రీహరీ॥ 5

చం॥ ఉపనిషదర్థము దెలియ, సూత్రము శాస్త్రము లాగమంబులున్
జపలుఁడ నోటచే నెఱుఁగ, శృంగారసాక్ష్యము లైన కావ్యముల్
విపులములౌ పురాణములు వేనలు నే విననైన లేదు, నీ
కృపయనుమీ మనీషయు, నకృత్రిమ విద్యయు, నాకు, శ్రీహరీ॥ 6

ఉ॥ వ్యాకరణంబు, తర్కమును, వాఙ్మయరీతు, లలంకృతుల్ ధ్వనుల్,
శ్రీకర కావ్యచిహ్నములె? చిన్మయరూప, భవత్కథా సుధా
పాకము లేకయున్న, నరపాళికి భక్తిరసానుభావ మ
స్తోకముగా మదిన్జానుపఁ దోడ్పడకున్న, సురాధిపా, హరీ॥ 7

ఉ॥ నీపద భక్తి యొక్కటియె నిర్మల యోగ్యతగాఁ దలంచి, నే
నోపుదు నంచు నీ శతక మొక్కటి వ్రాయఁగఁ బూనినాఁడ, నా
లోపములన్ హరించి, బుధలోకము దీనిని మెచ్చునట్లు, నా
పాపపు జిహ్వకు న్విమల భావము, నేర్పు, నొసంగుమీ హరీ॥ 8

శా॥ శ్రీవిద్యుల్లతగా, ఫణీంద్ర ముఖకృత్ సీత్కారము ల్గర్జితా
రావశ్రేణిగఁ, బాలసంద్రమను తారావీథి సువ్యక్తమై,
భావాతీత కృపాంబు వృష్టి నఘతాపం బార్చి, భక్తౌఘలి
ప్సావారంబను సస్యరాజి ఫలియింపన్ మూలమౌ, విష్ణువన్
ప్రావృడ్వారిద, తన్ను మన్మతి మయూరంబున్సదా, శ్రీహరీ॥ 9

శా॥ సత్యం జ్ఞాన మనంత' మంచు నినెగా సర్వశ్రుతు ల్దెల్ప, నా
దిత్యానీకము కెల్లఁజేయు ప్రణతు ల్దెల్లంబుగా నిన్నె పో
అత్యాసన్నతఁ జేరి సార్థకములౌ, నంభోనిధిన్దోయము
ల్గత్యంతంబునఁ జేరి తేజరిలు లీలన్, గైటభారీ, హరీ॥ 10

మ॥ హర వాణీశశచీధవాది సురులన్యావేశ హీనాత్ములై,
నిరతంబు న్నిను గొల్వఁ, జూడఁ, బొగడన్, నిష్కామ యజ్ఞంబులన్
వరుసన్నిర్జరులై, సదానిమిషులై, వాక్పాటవోపేతులై,

మరణంబు న్దగ గెల్చి, నిత్యము భవన్మాహాత్మ్యము ల్వ్రాచి, నీ
చరితం బిట్టి దనంగ నేరరు కదా! చక్రాయుధా, శ్రీహరీ॥ 11

ఉ॥ అట్టియెడన్ గుకర్ముఁడ, మహాల్పమతి, న్గడు పాపినైన, నా
యట్టి నరుండు నీ మహిమ నద్భుత లీలల నెన్న శక్తుఁడే?
పిట్ట వలె న్నరుం డెగిరి బిట్టుగనింగిఁ జరింపఁ జాలునే?
జెట్టియె యైన పామరుఁడు సింధువు నీది తరించునే? హరీ॥ 12

ఉ॥ అట్టిటు విన్నభంగి భవదద్భుత లీలల నెన్నఁబూనినేఁ
బట్టినపట్టు కానఁబడుఁ, బావకుఁ జేతను బట్టు రీతిగన్,
బట్టను దోయముంచి కడు భద్రముఁ జేయఁ గడంగు పోలికన్,
బట్టపగ ల్దివాకరుని పాదము లెన్ను విధంబుగన్, హరీ॥ 13

కం॥ ఐనను జేతును నీగుణ । గానము, బహువృత్త కందగతు లమరంగన్
దానను నాకగు ముదము, న । నూనఫలంబు గనుగొందు, నుతిపాత్ర, హరీ॥

కం॥ జననీ తన చిన్నబిడ్డ న । చనముల కలరు గతి, నీవు సంతోషముతో
డను దీని గ్రహించినఁ జా । లును, కోరను నే నితరము, లోకేశ, హరీ॥

శా॥ శ్రీచిత్తాంబుజ హారివై, నృహరివై, శ్రీమద్ధయాస్యుండవై,
వైచిత్ర్యాకృతుల స్సలీలముగఁ బూర్వాదిత్య సంహారివై,
ప్రాచుర్యంబుగ సృష్టిచేయ, ననుపర్, బ్రిధ్వంసము న్జేయ, వి
ద్యాచాతుర్యముఁ గల్గి, భక్తజన హృత్తాపాప హారుండవై,
యాచంద్రార్కము మించి శాశ్వతుఁడవౌ, దంభోజనాభా, హరీ॥ 16

కం॥ హరి యను నామము భాషను । గిరి భేద్యాద్యమరులకును, గీశోరగకే
సరిముఖ జంతుశ్రేణికి । గురు తగునది నిజమె కాని గుణయుతమె ? హరీ॥

చం॥ హరి ఖరభానుఁడౌ సతత, మారయఁగన్ హరి భోగలోలుపుం,
డరమర లేక యొక్క హరి యంతకుఁ డౌటయె నేర్పుఁ, దానిశా

చరుఁడు కళంకియగా హరి, విషజ్వాల నాప్తత సర్వజాతికిన్
హరి యొకఁ డోగిరంబగు, నహః! హరినాములు వారె? శ్రీహరీ॥ 18

కం॥ దేనిని హరియింపఁగ భువిఁ । గానఁగనగుఁ, సుజనులకు సుఖము సేమంబుల్,
జ్ఞానవిహీనుఁ ఖలులకగు । హానియు, దుఃఖంబు, దాని హరియింతు హరీ॥ 19

మత్తకోకిల॥ ఏడు కోట్లట మంత్రము జ్జపియింప నేరికి సాధ్యమా?
పాడిఁ దప్పక బోధ నొంది జపంబు సేసిన వానికిన్,
దోడ నేయగుఁ జిత్తవిభ్రమ దుర్బలత్వము, గావునన్
బోఁడలై, హరి నామకీర్తనఁ బూని చేసిన పుణ్యమే
యీఁడు లేనిది, దొడ్డదైనది, యీప్సితార్థదమైన, దం
చాడరే ఋషిపుంగవు, ల్బుధు, లాదిభక్తులు? శ్రీహరీ॥ 20

తోటకము॥ పురుషోత్తమ, భూధర, పుణ్యమయా, । శరణాగతరక్షక, చక్రధరా,
పరమాత్మ, జనార్దన, పాలయమాం, । గరుడధ్వజ, కోమలగాత్ర, హరీ॥

కం॥ విశ్వము నీయం దున్నను । విశ్వమునం దెల్ల నీవు విస్తరిలినఁ, ద
ద్విశ్వమునకుఁ బరుఁడ వెగా । విశ్వవిభూ, నీదు మహిమ విస్మయము హరీ॥

శా॥ ఏసత్త్వం బెట సంచరింపవలెనో, యెంచంగ నచ్చోటనే
యాసత్త్వంబున కన్ని సౌఖ్యముల, నాహారంబునుం గూర్చి, త
ద్గ్రాసంబు న్గడియించి మెక్కు, ననువౌ గాత్రాంగ నిర్మాణమున్,
ధీసత్త్వంబులు, దాని కిచ్చెదు దయాబ్ధీ, సర్వశక్తీ, హరీ॥ 23

మణిగణనికరము. మురహర, శుభకర, మునివర విదితా,
నరసిజ భవహర శతమఖ వినుతా,
నరహరి, రవిశశి నయన, జలధిజా
వర, నను దయగను, వసువసన, హరీ॥ 34

తోటకము॥ దశరూప ధరుండని, తావకనా । మశతావళి నున్నది మాటయె గా
ని, శుభాకృతు లెన్నియొ నీవిలఁదా । ల్తు, శతాశ్రిత పాలనలోల, హరీ॥

కం॥ ఆకూపాద్భుత లీలల, । నాకూఢవ్యాప్తిఁ గనిన యట్టి చరితలన్,
నే రూపించెద మాటల, । ధీరా, నాకున్న యట్టి ధీకొలఁది హరీ॥ 26

ఉ॥ "శ్రీల నొసంగు లేమ నెడ సేయవు, నా తలఁ పేది నీమదిన్?
జాలు భవద్గుణం" బనెడు చాయను, వార్ధి మునుంగు భూసతిన్,
'బోలు నె యింత యల్క' యని మూర్కొని యెత్తుచు, నో వరాహవే
షా! లలిత ప్రచారమునఁ జంపవె కాంచలోచనున్, హరీ॥ 27

చం॥ కపిల మునీశ్వరా కృతినిఁ గైకొని, యూదియుగంబు నందు రో
షపటిమ దుష్టసాగరులఁ జయ్యనఁ జంపి, రసాతలస్థలిన్
జపవిధి నుండి, వాజిముఖ సంతరణంబిన వంశనేతకున్
గృపఁ గలిగించి, సాంఖ్య మతకేకికి నర్తన నేర్పవే హరీ॥ 28

మ॥ అనసూయాత్మజ రూప మొంది, కృతవీర్యాత్మజ పరిభూతుఁ, బరితా
పనయోద్వృత్తుల వేయి చేతుల సిరిఁ భానూపముం జేసి, దీ

వనలన్వాని నజేయుఁ జేసి, నిజమౌ వైరాగ్య సంతుష్టిచే
మునులం జేసి తలర్కుఁగని, స్నసురరాట్పుత్రి, న్విరాగీ, హరీ॥ 29

మ॥ తతరాజీవ తనుండవై జలధిలోఁ దాఁజాడి, నిష్ఠీవనో
ద్ధతిచేఁ, బుచ్ఛశిఖోప తాడనమునన్, దద్వారి నెల్ల న్సన
క్రితిమిఁశాది వనాట సత్వముగఁ దారా వీధికిం జిమ్మి, వే
దతతి న్బ్రోవవె సోమకాసుర వధక్, దక్షుండవై, మున్ హరీ॥ 30

చం॥ అపుడు యుగాంతవేళఁ గనకాంచిత దీప్తుల నీను మేనితోఁ
దపన సుతున్మునీశ ముఖధన్యుల, నాతతపోత గర్భమం
దపగత పీడులౌ పగిది, నంబుధిపైఁ దగనిల్పి కావవే,
విపులతమో విభంజనము, విశ్వహితంబునుఁ, జేయుచున్ హరీ॥ 31

కం॥ పరమేష్ఠి యొనర్చిన మఖ । వరమందు, న్గనకరుచుల వఱలెడి దేహం
బు, రదంబులు, గల హరివై । కురియించితి హేమల, శ్రుతికూటమును, హరీ॥

మ॥ ఉరుకాఠిన్యము గల్గు కర్పరముతో, నద్భాధ సత్త్వంబుతో,
స్థిర నిశ్చంచల జానుజంఘ చరణశ్రేష్ఠ ప్రత్యయుక్తంబుగా,
గురు కూర్మాకృతిఁ దాల్చి, యబ్ధిఁబడు పెన్గొండ న్సముద్ధారణం
బు రయం బొప్పఁగఁ జేసి, దేవహితముం బోషింపవే? శ్రీహరీ! ౩౩

కం॥ సకలామయ భయవారక । కకుబంత వ్యాప్త సుఖద కరతల తేజం
బొక వైపున, నమృత కలశ । మొక కేలను, బూని వైద్యయోగనిధి, హరీ॥

కం॥ శకలీకృత కలశోదధిఁ, । బ్రకటామర దైత్య యత్న ఫలముగ జననం
బు కలిగి వెలిగితి, రోగాం । తక, ధన్వంతరి, మహౌషధజ్ఞాన, హరీ॥ 35

ఉ॥ వాక్కమలాంబికా సతుల వామకుచానన దృగ్విలాసముల్,
ధిక్కరణంబు సేసి, తనుదీప్తులు సర్వదిశాంచలంబులన్
గ్రిక్కిఱియ, న్మనోజ్ఞముగఁ గేరుచు, ముద్దుపడంతివై హరుఁ
స్రుక్కఁగఁ జేసినట్టి నవ సుందర లీలల దైత్య సంతతిన్

వెక్కసమందఁ జేసి, సుధ వేల్పుల కిచ్చిన మోహనాంగివో,
ఎక్కుఁడు జాణవాఁడు, విక నెంతటి మాయగలాఁడవో ! హరీ॥ 36

శా॥ దంభోళి ప్రతిమాన తీక్ష్ణనఖ సంతానంబె యోధాళిగా,
గాంభీర్యంబె రథంబుగా, దశదిశ ల్గంపింపఁ జండాకృతిన్
స్తంభంబం దుదయించి, హేమకశిపు స్సంహారము జేసితో
డింభోత్తంస శరణ్య, కొల్తు నృహరీ, డెందంబునన్, నిన్, హరీ॥ 37

ఉ॥ దేవతలన్న నాటవులఁ ద్రిమ్మరునట్లు పరాభవించి, బా
హావిరళ ప్రభావమున నా త్రిదివంబును నాక్రమించు దై
త్యావళి నొంపగా, నదితి యాచనఁ దీర్చిన వామనాంగు, నిం
ద్రావరజు, న్దలంతు నిను, నద్భుత వాక్చతురాస్య, శ్రీహరీ॥ 38

చం॥ సిరిగల వాఁడవయ్యున, వశీకృత భూవలయుండ నయ్యుమున్,
సురహిత మాచరింపఁ గరశోభిత దండ కముండలుండవై,

వరవటు మూర్తివై, దనుజవర్యుని భూమి పదత్రయంబు కో
సర మడుగంగ లేదె? యది చాటు త్వదాశ్రిత సత్కృపన్ హరీ॥ 39

కం॥ మూఁడడుగుల నేల న్గొని। తోడన విశ్వంబు నిండఁ దంగతనుఁడవై,
మూఁడవ పాదము మేర య। దేడని, బలి నణఁగఁ ద్రొక్కితే తుదకు! హరీ॥

ఉ॥ బాహుజ గర్వభంజనమె పట్టిన పట్టుగ, నిర్వదొక్క మా
ర్లాహవరంగ మందు, నిశితాస్త్ర శరంబుల రాజసంతతిన్
గేహము లందు డాగిననుఁ గీటడఁగించి, నశింపఁజేయు, నీ
బాహుబలం బదెట్టిదియొ! పాఱుఁడ, భార్గవరామ, శ్రీహరీ॥

ఉ॥ వారిజగర్భవంశమున వర్ధిలు సంయమి కాత్మజుండవై,
ఘోర రణోపయుక్త శరకోవిద వృత్తినిఁ బూని తేలొకో?
బోరున తండ్రి యానతినిఁ బూని వధించితె తల్లినైన? నాఁ
గారణజన్ములై భువినిఁ గన్పడు ధీరుల కార్యధర్మముల్,

సూరిజనాళికి నెద్లియఁ జోద్యము, పామరు లారయంగలా
రే? రణ నిర్జితార్జున, శరీరవిభాజిత పావకా, హరీ॥ 42

పంచచామరము॥ వశిష్ఠ సూనుఃపౌత్రకా, శివంకరా, పరాశరాం
శశోభితాంగ, కౌరవేశ సత్కులోద్ధరా, పురా
ణ శుద్ధికల్పనా, తమోఘన ప్రభంజనా, ప్రభూ,
అశేష శేముషీ విరాజితాంచితాకృతీ హరీ॥ 43

తోటకము॥ సరిదంతర సంభవ, సత్యవతీ । వరపుత్ర, మునీశ్వర, వాఙ్మయ సా
గర బంధన, వేదనికాయ పృథ । క్కరణ క్షమ, నిర్జిత కామ, హరీ॥

ఉ॥ చక్కఁదనంబు, శౌర్యమును, సత్యము, శాంతము, ధర్మశీలమున్,
మిక్కిలి గూడివచ్చి, యొక మేటి మగండగు రూపమైనయ,
ట్లక్కమలాప్త వంశ కలశాబ్ధికి సోముఁడవైన రాజవై,
పెక్కురు రాక్షసాధముల, భీకర రావణ కుంభకర్ణులన్,

జక్కడగించి చంపితివి, సాధుల మానులఁ బ్రోవగన్, హరీ॥ 45

కం॥ రామా, రంజిత సుజన । స్తోమా, జితకామ, రవిజ దుఃఖ విరామా,
శ్యామాంగ, ఘోరభవహర । నామా, దనుజకుల భీమ, నయధామ, హరీ॥

శా॥ శ్రీరామా, పితృసత్యపాలక, కపిశ్రేష్ఠాశ్రితాంఘ్రిద్వయా,
వీరాగ్రేసర, మందహాస విలసద్వక్త్రాస్య, యాజానుబా
హ్వారోహస్థిత దివ్యచాప శరధీ, యజ్ఞావనా, మౌనిరా
డారాధ్యా, శరణాగతావనచణా, యాజ్ఞాపితాబ్ధీ, హరీ॥ 47

కం॥ భరతాగ్రజ, కౌసల్యా । వర దివ్యతపః ఫలంబ, వల్మీకభవో
ద్ధర ధీరసుపుత్రద్వయ, । నిరసీకృత వహ్నితైక్ష్ణ్య నిజభార్య, హరీ॥ 48

కం॥ కులగురు వైరియె గురువుగ । విలువిద్యను నేర్చితి, కులవిశ్రుత రిపుకాం
తులఁ బొందితివి, జగద్గురు । విలుద్రుంచితి వాలికొరకు, విస్మయము హరీ॥

మణిగణ నికరము. దశరథ వరసుత, తపన భవసఖ ,
కుశలద ముఖరుచి, గుహనుత చరితా,
విశద విమలపద, విహగకృతహితా,
కుశశయన సున్నృప, కుధరచర, హరీ। 50

శా॥ లోలాక్షీ! భవదీయ నేత్ర యుగళీ లోలత్వమే నన్నిటుల్
మేలం బాడె మృగాకృతిన్; గినుకతో మేలే ననున్గూడ? నీ
వాలుం గన్నుల నాహరించితి నెటు ల్వాలాయము న్నాదు భ్రూ
లీలాఖేలన, నల్లై, నీకొరకు నాలేడిన్, శరోత్కర్ష చేఁ,
గీలింతు న్గరమందుఁ జూడు, మను వాక్క్రీడ న్ధరాజాతకున్
జాలన్మోదము, సిగ్గు, గూర్చు రఘువంశగ్రామణీ, శ్రీహరీ॥ 51

కం॥ అడితి వొకమాటయె, మా । రాడక దాఁకి నెపుడు ; నిలాత్మజ దక్కన్
గూడి యెఱుంగవు వనితను । వీడితి వొకశరమె యొక్క విషయమున, హరీ॥

కం॥ రూపాంతర ధరశేషా । త్యాపాదిత భ్రాతృ మోహా, హరిసుత వరదా,
పాపాశ్రియ ఘామాంతక । శాపోద్ధృత రామ, రామ, సత్యేశ, హరీ॥ 53

కం॥ అర్పిత వాయుజసేవా । తర్పిత దనుజేశ బంధు తాత్పర్య, వచో
దర్పమయ పాపి శిక్షక । దర్పక పోషణ తనయుత, దండంబు హరీ॥ 54

శా॥ శ్రీకృష్ణా, యదువంశ దీపక, శుచిస్నిగ్ధాబ్ద వర్ణాంగ, లో
కైక స్తుత్య పరాక్రమా, నగధరా, యాజన్మ మాయాక్రియా,
వ్యాలోచాంబుజ పత్రనేత్ర, నిఖిల వ్యాపార పారీణ, భ
ల్లూకా గ్రేసర శిక్షకా, బహువధూ లోలాంత రంగా, హరీ॥ 55

స్రగ్విణి॥ తూగు టుయ్యాలలో దొంగ బాలుండవై
బాగుగా పాదమున్ బైకెం జాపంగం ద
ద్యోగమే బండియా వ్రేగురా కాసికి
నోగుం జేసెన్గదా వ్యోమవీథిణ్! హరీ॥

కం॥ ధరియించితి, బహుగోపక । వరగోగణ భద్రరూప వర్తనలెల్లన్,
సురమునికై బహుకృష్ణుల । వరుసయు, నొక కాలమందె, వరసృష్ట, హరీ॥

హాలముఖి॥ దేవకీసుత, పరమమో । దావహామల మురళీ గా
నావధాన హృదఖిల గో ।పీ వివేక హృదయ, హరీ॥ 58

కం॥ వసుదేవాత్మజ, రుక్మి । ణ్యాసువల్లభ, నందసన్ముదాస్పద, రాధో
ల్లసదాస్యాంబుజ బంభర । వసువేషాంతర ధరనుత, వనమాలి, హరీ॥ 59

కం॥ జనలోకోత్కట కంటక । దనుజాకారులను, గంస ధాత్రీ సుతులన్
ఘనమాతు లాత్మజులనే । పనిగొని చంపితివి, నయము పాటించి హరీ॥ 60

కం॥ పంచప్రాణములే నీ । కెంచగ పాండవులు, వారి దెట్టి తపమొ? క
ష్టించి కనక, శిశువగు ని । న్నెంచిన యమ పుణ్యమునకుఁ బెచ్చున్నె? హరీ॥

కం॥ వాడుక, నీ సంకల్పము । పోడిమియే సృష్టియంచుఁ, బొల్లది యగునే?

కూడును గుడ్డయుఁ గృష్ణుఁ । గూడె నమితముగ, నీదు కోరికనె, హరీ॥ 62

కం॥ అష్టైశ్వర్య సుసిద్ధుల । నిష్టంబగు గతుల నంప నేన తగుదునం,
చ ష్టాపదరుచి గాత్రియు । తాష్టేష్ట కళత్రి సిద్ధి, నందతివి హరీ॥ 63

పంచచామరము. జగాలి నెప్పుడు న్సగోత్రి జంతుపాద పాబ్ధిగా,
ఖగేశవాహ! నీవు గర్భ కందరంబున న్భరిం
తు, గాన నీదు భార మెట్టిదో యనంగలే; మదే
యిగాధ ? రుక్మిణీ మృగాక్షి మిమ్ముఁ దూచి చూపె నీ
సుగాగ, నొక్క పల్లవంబుఁ జొన్పి తాసునం, దహో
యగోచరబుగా త్వదాశ్రియ ప్రిభావ ! మో హరీ॥ 64

కం॥ పిడికెం డటుకులకై, నీ । విడితి ధరామర సఖునకు నెల్ల సిరుల, నె
వ్వడు నినుఁ బోలెడు సంతు । ష్టుడు, దాతయు, విశ్వసుందు ? సురసేవ్య, హరీ॥

మ॥ హరి నీవయ్యు గజేంద్రుఁ బ్రోచితివిగా, యత్యద్భుతంబయ్యె నీ
వరదాక్షిణ్య మహత్వ మెన్న, నహిరాడ్వంద్యా, సుసత్వాంబుధీ,
హరినీవయ్యు హరీశ మర్దనుఁడవై తర్కాత్మజాసక్తతన్,
సరి నీ కెవ్వరు ధర్మశీలమున, శిక్షాభిజ్ఞతన్? శ్రీహరీ॥ 66

క॥ పరమపదంబున శబరినిఁ । దిరముగ నీ వుంచి తామె తినిన ఫలమిడన్ ;
సరివారల నిరసించితి । వరశూద్రుం డిడిన విందు వాంఛించి హరీ॥ 67

క॥ కావున నీ దయఁ బొందఁగఁ । గావలెఁ గారణము లర్థ గౌరవకులముల్
భావ విశుద్ధియు, శీలముఁ, । గావలయును నీకు నెఁదుఁ, గమలేశ, హరీ॥ 68

ఉ॥ భూతదయా ప్రవర్తననుఁ బోలఁగ లేవిల నెట్టి ధర్మముల్,
నీతులు, యజ్ఞయాగ ముఖ నిష్ఠుర కర్మలు నంచుఁ జాట, భూ
నేతకు గౌతమాఖ్య సుతనిష్ఠనుఁ జూపుచు, కర్మయోగ మో
హాతుర వృత్తి మాన్పవె జనాళికి? బుద్ధయశుండవై, హరీ॥ 69

కం॥ కలి యావేశముచేతను । తొలిధర్మము లన్ని మరచి త్రుళ్లెడివారిన్,
బలులన్ మ్లేచ్ఛుల, నసిచేఁ । బొలియించెడి కల్కిమూర్తి, పురుషవర, హరీ।

మత్తకోకిల॥ పాలవెల్లియె పాదుగా, నిజభవ్యగాత్రమె బోదెగా,
మూల సంతతి సత్యచిన్మయమోద ధర్మగుణాళిగా,
మేలుగా నిజ బాహుపంక్తియె మేటి కొమ్మలుగాఁగఁ, బ
ద్మాలతాశ్రితమౌ నఖాంగుళి మండలంబె చిగుళ్లుగా,
క్రాలు శంఖ రథాంగ నందక ఖడ్గము ల్ఫలరాజిగా,
నీలవర్ణ సుకల్ప భూరుహ నిష్ఠఁ జూపుదు, వో హరీ॥ 71

ఉ॥ పావనమైన యభ్రనది ప్రస్ఫుట జన్మకు మూలసీమ, దా
నావధియైన దైత్యు శిరమందలి పద్మ, మహల్యకున్, శిలా
స్థావర రూప శాపగతిఁ జయ్యనఁ బాపిన సిద్ధరత్నమున్,
దావక పాదయుగ్మమది దాసులకు న్సుర భూజమో హరీ॥ 72

ఉ॥ కావునఁ, దత్పదాంబురుహ కమ్రపరాగము, నీదు సత్కృపా
పావన వాయువేగమున బంధితమై శ్రిత హృత్సుమావళిన్,
దావల మాను ముక్తి ఫలదాయక వృత్తికిఁ, దజ్జ నోరు వృ
త్తావళి కెల్లఁ, దచ్చరణ సన్నుత లీల లికెట్టివో! హరీ॥ 73

కం॥ నా మదియను కఠి నోపల । సీమను నీ పాదయుగము చెచ్చెర నిడు, త
తోఁచుల వృత్తికి భంగము । దేమగునో యంచుఁ గొంచ, కిభవరద, హరీ॥

కం॥ నిత్యము వానికి మ్రొక్కుచు । సత్యముగా వానికాంతి సాహాయ్యమునన్,
బ్రత్యహము న్మదిఁ దోఁచెడు । కృత్యములఁ దమో నివృత్తి నీక్షింతు హరీ॥

కం॥ నిను భజియించుట కంటెను । ఘనమగు సంతసము నీకుఁ గలిగించునుగాం,
మనుజుఁడు నీ భక్తులఁ గను । గొని,. వారినిఁ బొగడుటయును, గొల్చుటయు, హరీ॥

చం॥ హరి, భవదీయ సత్కథ లహర్నిశము న్గడు భక్తితోడ వే

వరుసలఁ బెట్టి పాడి, వినువారలు స్నేహము తన్మయాత్ములై
పరమపవిత్ర వృత్తి నిను భావన సేసెడునట్లు చేయు, నా
సురముని నారదుం డహహా! శుద్ధచరిత్రి యుదే కదా? హరీ। 77

ఉ॥ నారదుఁ డట్లు చేసి పదునాలుగు లోకము లెల్లఁ గ్రుమ్మరన్,
సారవివేకులై, యమిత సంఖ్యల జీవులు నీ పురంబు రా,
వారల కెల్ల వాసములు వైభవము ల్సమ కూర్పలేక, త
త్కారణ మెంచి, యన్యమగు కార్యము మానికిఁ గూర్ప నెంచి, యా
హారము వాని కెందుఁ గలహంబు నట్లొనరించితే? హరీ॥ 78

కం॥ ప్రీతిఁ దరింపుచు గానము । చేతను, బ్రహ్లాదుని, ధ్రువుఁ, జిన్నప్పుడె భవ
త్పూత పదాంబుజ మధుప । ఖ్యాతులఁ జేసిన మునిదియె గారవము; హరీ॥

చం॥ తొలుత హనూమదాఖ్యు నిలఁ దోరపు సేవను నీకుఁ జేసి, యా
వల బలుఁడైన భీమ కురువంశ శిఖామణియై, నిశాచరా

శిలయమై వృత్తిగాఁ దనరి, లెస్సగ మధ్యమునిష్ఠమై, శ్రుతి
స్థలములఁ బడ్డకంటకవితానము నేఱియుఁ బారవైచి, యా
స్థలముల నున్న సారమునుఁ దర్కహలంబునఁ బైకిఁ దెచ్చె, నే
సలలిత మూర్తి; కాగలఁడు సారసగర్భుఁ డెవండు, వానినేఁ
దలఁచెద వాయుదేవుని సదాగతిరూపుఁ, ద్వాదశస్తోత్రముల్,
బలుకుల నిర్మించు గురు భాగ్యము నాకిడ వేడుచున్, హరీ॥ 80

కం॥ అసురేశ సుతుండయ్యును । బసివాడే యయ్యుఁ, బెక్కు బాధలఁ బడుచున్,
విసువక నీ నామామృత । రసపానముఁ జేయు బాలు రహి నెంతు హరీ॥ 81

కం॥ జనకుని తొడ నెక్కంగఁ జా । లని బాలుఁడు, ధ్రువుఁడు, నీదులసదాశ్రయమున్
గొని, భువిపై గద్దెయును, గ । గనమందున ముఖ్యపదముఁ, గడకెక్కె హరీ॥

కం॥ హరివాసర దీక్షారతు । హరి వంశజు, నంబరీషు, నణఁగం ద్రొక్కన్,
గురుశక్తిని దూర్వాసుఁడు । పురికొల్పంగ, నృపుఁడు నిన్నుఁ బూజింప, హరీ॥

కం॥ నీదు సుదర్శన చక్రము । గాదే? యతనిఁ గాచె శక్తిఁ గాల్చియు, వహానిన్
రోదనతో భువనంబులఁ । బోఁ దరుముచు శరణమునకుఁ, బోరిఁబోరిని, హరీ॥

కం॥ అట్టి సుదర్శనమును నరి । కట్టఁగ లేరైరి యేరుఁ, గడకా రాజే
పెట్టినసుభిక్షు ముని కిల । నట్టిది నీ భక్తుల మహిమార్జవము, హరీ॥ 85

ఉ॥ తావక రూపశక్తులను, తత్కృత లోకహితంబుల, స్మరు
తాత్మవిభుఁడా పరీక్షితుఁడు, సాధువరాగ్రణి, యేడు రోజులన్
భావ విశుద్ధి పొందఁగల భంగిని భాగవతంబుగా నిలన్,
ధీవిధిఁ జెప్పినట్టి ముని దేశికు, నాశుకు, నెంచెదన్ హరీ॥ 86

కం॥ వ్యాసుని సుతునకు, నిరతో । ల్లాసునకున్, యోగమాత్రలఘువాసునకున్,
భూసుర తేజోరాశికి, । శ్రీసఖ భక్తోత్తమునకుఁ, జేతునతి హరీ॥ 87

కం॥ మరియును శౌనక దాల్భ్యుల, । నర రుక్మాంగద ముఖులగు నగులన్, ద్వాద్భ

క్తిరసా కూపారుల, నే । నురు గౌరవ మొప్పఁ గలఁతు నల్లఘున హరీ॥ 88

ఉ॥ మూలల డాగి మంత్రముల ముక్కు బిగిఁపల, నాదిదేవ, నిన్
జాఁగఁ దృష్టి చేయుటది సాధ్యమె; యైనను మానవాళి యం
దాలయ విగ్రహంబులను నత్యధికంబుగ నించి యుంచు, నీ
లీలయుఁ జేతనంబు; నది లెక్కగుట, న్సాశము స్జనాళికిన్
మే లొనరించు చుండుటయె మేలగు నీశ్వరసేవ, శ్రీహరీ॥ 89

ఉ॥ చేయఁగలేను వేదములఁ జెప్పిన బ్రాహ్మణ నిత్యకర్మలన్,
బాయఁగ లేను దారసుత బాంధవ మోహము, లోభశీలమున్,
కాయము వంచి లోకహిత కార్యములం బొనరింతునన్న, నా
కే యనువు న్గనంబడ, దికెట్టులు నేను దరించునో? హరీ॥ 90

ఉ॥ మానవు లెన్నియో విధుల మాటలఁ, జేష్టల, మానసంబులన్,
బూనికఁ జేయకున్న నిలఁ బొందరు జీవన మూలమా ధనం

బానెడు వృత్తి నిప్పు, డిక నాజనసార్థ విహీనుఁ డన్గదా,
ధ్యాన జపాగ్నిహోత్ర పరతంత్రత నే నెటులుందు? శ్రీహరీ॥ 91

కం॥ వీలగు నంతటి మేరకుఁ । గాల పరిస్థితులఁ బట్టి కర్మల నొరులన్,
దేలిక చేయక, నొంపక, । తాలిమితో నుంతు, నిన్నుఁ దలఁచుచును హరీ॥

కం॥ లలనకుఁ బాతివ్రత్యము, । కులపూరుషునకుఁ బితరులఁ గొల్చుటయు, విధా
తలఖించిన ధర్మము; నేఁ । దలిదండ్రుల నెపుడు గొల్చు దశనిమ్ము హరీ॥ 93

శా॥ నీ నామంబులకు న్గుణాకృతులకు న్నైక్యంబు భేదంబు లే,
దీనామంబు ఘనంబు దాని కనఁగా నీర్ష్యా మహాదోషమౌఁ,
గానిమ్మైనన విశేష మున్నది. యనంగ న్దప్పె? నారాయణా,
యీ నామంబును, రామ కృష్ణ హరులౌ నాఖ్యల్ప్రసిద్ధంబులౌ,
నే నిమ్మాన్నవయ జాతు జిహ్వ నయి నన్నే విందువానిన్, హరీ॥ 94

కం॥ నీ నారాయణ నామ । ధ్యానోచ్చారణలఁ జేతు దండం బిడుచున్,
దీనాత్ముఁ డజామీళుఁడు । గానే కాఁడనక, నన్నుఁ గైకొమ్ము హరీ॥ 95

కం॥ నీ వాసుదేవ నామము । భావాంతర దీపమరయఁ బరమ మునులక్కన్,
నే వాంఛించితి దానిని । నీవా ధ్రువ చిత్తుఁడ వననేరకుము హరీ॥ 96

శా॥ నీ రామాఖ్యఁ బఠించి ముక్తిఁ బడయన్నే నెంత? వాల్మీకినా?
పారావారము దాటినట్టి కపినా? భద్రాద్రి గోపన్ననా?
'శ్రీరాము న్గనఁ గొంటినేఁ' డను కృతి న్జెన్నొందు సంగీత శా
స్త్రారామంబున నిన్ను నిల్పి గొలువన్ ద్యాగయ్యనా? శ్రీహరీ॥ 97

కం॥ ఐనను, నీ రామాఖ్యను । నే ననుదినము న్స్మరింతు, నీ కృప పిసపన్,
దేనిని నా కిచ్చెద వరె । నే నొక యాచకుఁడ నంచు, నీ వెంచి హరీ॥ 98

చం॥ హరికథ యందురయ్య భవదంశనుఁ దెల్పుచు గానరీతిగాఁ

బరగు కథన్, శ్రుతిస్మృతుల పాఠము శాస్త్ర పురాణ బోధనల్
హరియుత 'ఓం' స్వరాదిగను నార్యులచే విదితంబులౌఁ గదా!
ధర హరిదాసుఁడౌ జనుఁడు, దాస్యము నీ కెటు చేసినన్ హరీ॥ 99

కం॥ హరి యను రెం డక్షరముల । గురునియమము తోడ, భక్తిఁగూడిన మతితో
స్మరియించు చెవఁడు, వానికిఁ । దిరమగు నిహపరసుఖములు, ధీవర్య, హరీ॥

కం॥ హరి నామ స్మరణం బిలఁ । బొరిగొనఁ బాపముల నెల్లఁ బొందించు శుభం,
బరినాశన, మురుయశమును, । నరులకుఁ జేకూర్చు, భవ్యనానుయుత, హరీ॥

కం॥ హరియను లఘుయుగ శోభిత । వరనామము సులభమైన్న వ్రాయను, జదువన్,
ద్వరగ జపింపఁగఁ, గావున । హరి తుది పదమైన శతకమల్లితిని హరీ॥ 102

ఉ॥ లోకము లన్నిటి న్నతము లోఁగొనియుండెడు నీదు విశ్వమూ
ర్త్యా కృతికిన్; పదంబు లిల, యాకసమే యటనాభి, మూర్ధమా

నాకము, కన్నుదోయి దిననాథ సుధాంశులు, గాలి ప్రాణమున్,
శ్రీకర మాస్య మగ్నియట, చెట్లు లతల్ఘన రోమరాజి, ర
త్నాకర పంక్తి కుక్షి, చెవు లన్ని దెస, ల్గమలోదరా, హరీ॥ 103

సుముఖ వృత్తము॥ గజవరదా, కరుణాలయ, హరా । నిజననుతా, నిఖిలాగమవే
ద్య, జనకజాధవ, దాశరథీ । వ్రజలలనావన, శౌరి, హరీ॥ 104

కం॥ ఈమహిగల ప్రతిదేశము । సేమముగా లేక, యిపుడు చిక్కెను రణమం,
దేమగునో రేపను భయ । మే, మది నేనరునకైన, మేలిమ్ము హరీ॥ 105

కం॥ మదవారణమునుఁ గాచిన । యదనున నీకున్న వేగ, మల ప్రహ్లాదున్
తఁదిఁ గాచిన నీ యుక్తియుఁ, । గొదకానీ కిపుడు మాకుఁ గుశల మిడు హరీ॥

కం॥ గౌతమ ముని గోత్రుఁడనే । ద్వైత మతస్థుఁడను, నీదు దాసాశ్రయుఁడన్,
ఆతత మారేమండ కు । లాతి శుచిత్వమున జనన మందితిని హరీ॥ 107

కం॥ వరహాలను పేరనునే । ధరఁ బరగుదుఁ గృష్ణశర్మ తగు జనకుఁడుగాన్,
గురుసేవఁగఁ, గృష్ణార్పణ । పరత, నీ శతక మిటులు పలికితిని హరీ॥ 108



విశాఖపట్టణము : కింగ్ అండ్ కో., వారి లా నోట్సు ప్రెస్ నందు ముద్రితము—1948.

